# క్షేత్ర మహిమ.

శ్రీ మహార్యావర్త దేశంబునంగల క్షేత్రంబులలో శ్రీ మల్లేశ్వర క్షేత్రముగూడ ప్రసిద్ధివహించి మహిమను చేకొన్నుచున్నది. తద్దేవుని సేవించి ఫలమును బొందిన భక్తులకు వెలిసియే యున్నది. ఇయ్యది పూర్వము మంత్రి చిట్టరసుచే ప్రతిష్ఠింపబడినట్లు శాసనమువలన గానవచ్చుచున్నది. శ్రీమల్లేశ్వరస్వామి మాంబాలు ఇలవేల్పుగా నుండి రక్షించుటం జేసి మాజనకతండ్రి దేవళము పునరుద్ధారణగావించి శ్రీభ్రమరాంబా వీరభద్ర భద్రకాళికాంబల నూతన ప్రతిష్ఠల గావించెను. తత్పూర్వాగమును మేమును నిక్కి వాచనలేక తద్దేశ

స్థాన మభివృద్ధి జేయుచున్న సంగతి దెలుపుట ఆత్మస్తుతియే. శ్రీ స్వామి వారి దర్శనార్థమై యనేకులు దూరమునుండి వచ్చి స్వామిని సేవించి కార్యసిద్ధిం బడసి చనుచుండుట విశదమే. స్వామిని సేవించిన వారనేకు లిడుములబాసి సౌఖ్యమునొంది యుండిరి. అట్టి మహిమగల దేవుని ప్రార్థనముల నిప్పుడీ గ్రంథ రూపమున వెలువడజేయ గలిగినందులకు సంతసించుచున్నారము.

ఇట్లు.

కొల్లిపర రామకోటయ్య బ్రదర్సు.

# ధ్యాన శ్లోకములు

శ్లో॥ వందే శంభు ముమాపతిం సురగురం వందే జగత్కారణం
వందే పన్నగభూషణం మృగధరం వందే పశూనాం పతిం
వందే సూర్యశశాంక వహ్నినయనం వందే ముకుందప్రియం
వందే భక్తజనాశ్రయం చ వరదం వందే శివం శంకరం॥

శ్లో॥ శాంతం పద్మాసనస్థం శశిధరమకుటం పంచవక్త్రం త్రినేత్రం
శూలం వజ్రం చ ఖడ్గం పరశుమభయదం దక్షభాగే వహంతం
నాగం పాశం చ ఘంటాం ప్రళయహుతవహం సాంకుశం వామభాగే
నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి॥

శ్లో॥ శంకరస్య చరితాకథామృతం। చంద్రశేఖరగుణానుకీర్తనం
నీలకంఠ తవపాదశేవనం । సంభవంతు మమ జన్మ జన్మని

శ్లో॥ ఓంకార పంజరశుకీం । ఉపనిషదుద్యాన కేళికలకంఠీం
ఆగమవిపిలమయూరీం । ఆర్యామంతర్విభావయే గౌరీమ్॥

ఓమ్ ఓమ్

శ్రీ భ్రమరాంబా  మల్లేశ్వరాయనమః

# మల్లేశ్వర కీర్తనలు

శా॥ శ్రీకాళేశ్వరహారకీతగిరిజా॥ చిత్తేశ మృత్యుంజయా
పాకారిప్రముఖాది నిర్జరనుతా॥ భక్తార్య సంపూజితా

లోకాతీత గిరీశ చంద్రమకుటా ♦ ఉద్ధండాటవీపావకా
కాకానీపుర ధామ ధూర్జటిహరా ♦ గంధేభ చర్మాంబరా॥

గా॥ పారావారవిషంగ హేమగిరిచా ♦ పా, పాపసంహార స
ద్ధిగ్భోదార దిగంబరా భవగుణా ♦ తీతార్య సంశేవ్య శం
భో, రాత్రించరనాశ, శూలంధరక ♦ ర్పూరాంగ శోభస్ఫురా
గాంగీనాధ సనాతనా పశుపతే ♦ కాకాని మల్లేశ్వరా॥

ఏ॥ మదదైత్యాంతక భూతనాయక శివా ♦ నాగేంద్రసంపోషస
త్సదయాపాంగ వృషేంద్రవాహా, నిటలా ♦ క్షాంగారిచిత్తాబ్జష
ట్పద సంగీతవిలోల, కామహర, స ♦ ర్వశ్రేష్ఠహరోత్తమా
పెదకాకాని పురప్రదీపసదనా ♦ పృథ్వీశ సంపూజితా॥

కృతిప్రోత్సాహకుల వంశావళి.

ఉ॥ ధారుణిమంత్రిచిట్టరసు దాత ♦ ప్రతిష్ఠితమైనలింగమె
వ్వారుఘటించె యంత్రము న♦వార్యముగా నలవైశ్యవర్ణ సూ
పారహిమాంశు లక్ష్మిజన ♦ పాలనశీలురు దానధర్మ దు
ర్వారులునై నకొల్లిపర♦వంశ్యులు వృద్ధినిజెందుచుండెడిన్॥

గీ॥ అంకుకోటయ యెల్లమం ♦ దార్య సత్య
వాది వెంకటరత్నము ♦ స్వామిరాము
లను ధరాస్థలిగాంచెను ♦ తనయులుగను
సారసద్గుణమతుల స ♦ ద్ధీర యుతుల॥

కం॥ వారల వెంకటరత్నము

వారక భ్రామరిని వీర ♦ భద్రస్వామిన్
ధారుణి బ్రతిష్ఠ జేసెను
శ్రీరమణీయముగనల్లు ♦ శివు నొనరించెర్ ||

గీ|| కోటయార్యుని మనుమలై ♦ కొమరుమీరు
నట్టి నాగేంద్రరామ కో ♦ టార్య రామ
స్వామి మల్లయనాములు ♦ సాంబమూర్తి
దేవళంబును వృద్ధికి దెచ్చిరెలమి||

గీ|| కొల్లి పర యల్లమందార్యు ♦ తల్లజునకు
భాగినేయుఁడు గోడవర్తి ♦ వెంకేశమూర్తి
రాధకృష్ణార్యవర్యుఁడు ♦ రమ్యగణప

తిని ప్రతిష్ఠనొనర్చె భూ ♦ జనులు మెచ్చ॥

గీ॥ వారిలో రామకోటార్య ♦ ధీరుడు నను
బిలిచి యొక్కింత సద్గోష్ఠి ♦ సలిపి పలికె
కీర్తి దైవార మల్లేశు ♦ కీర్తనముల
సరగ వ్రాయుము సంగీత ♦ సరణి ననుచు॥

వ. అంత నమ్మహానీయు నభీష్టంబు దీర్పనెంచి.

గీ॥ చేసితిని చిన్ని పొత్తంబు ♦ చెలువు మీర
తప్పులున్నను పండితుల్ ♦ దయదలిర్చ
దిద్దవేడెద బసవార్యు ♦ ముఖ్యసుతుడ
గ్రంథి వేంకట సుబ్బరాట్ ♦ కవివరుండ॥

1 విఘ్నేశ్వర ప్రార్థన.

పాహి విఘ్నేశ యను మెట్టు, అటతాళం.

పాహిగణేశ భవ దోషనాశయో ॥పా॥

ఆహవరిపుజైత్ర యహిరాజ సూత్ర ॥పా॥

సద్భక్తసదన సామజవదనయో ॥పా॥

మోదుకహస్త ముల్లోకశస్తయో ॥పా॥

గౌరీకుమారా ఘన సుకుమారయో ॥పా॥

కాకాని నిలయ కల్మషవిలయయో ॥పా॥

2 తాండవ నృత్యకరి యను వర్ణమెట్టు.

హైమవతీ తనయా వినాయక ॥హై॥

సామజవదన సద్గుణసదన పామరజనదూరా ॥వి॥

పాతకహరణా చర్మాభరణా భూతగణస్తోత్రా ॥వి॥

పావనశీలా భానవిశాలా సేవకజనపాలా ॥వి॥

త్రిజగత్పూజిత నీరవిరాజిత సుజనామరభూజా ॥వి॥

కాకానిపుర ప్రాకటమందిర రాకాశశివర్ణ ॥వినాయక॥ హై॥

3 నమిలాక్ష్ శ్రీగణనాథ గజానన-యను వర్ణమెట్టు.

గజరాజవదన విజయారికదన సుజనవందిత చరణా॥గ॥

కృష్ణాజినధర కృష్ణపూజిత వర్ధిష్ణుమోదకహస్త ॥గణాధిప॥

ఫణిరాజసూత్ర పమరపవిత్రా మణిమయ మకుటధరా॥గణా॥

శోకవినాశన శోభితసూచన కాకాని పురమందిర ॥గణాధిప॥

పామరజనదూరా భక్తమందార రామకోటార్యనుత ॥గణా॥

పాలించరా పాండురంగా-యను వర్ణమెట్టు.

తిరుపతి శైలనివాసా । శ్రీ । కరుణోద్విలాస సుందర మంద
హాస ॥సుం॥తిరు॥

పరమపురుష భీకర పాపనాశ । నిరుపమగుణాదీశ హరి హరి
రూప।యో ॥తి॥

సంకటహారణ వాసవనుతచరణ పంకజ భవనుత వెంకట
రమణ । యో ॥తి॥

ఒడ్డెల్లొట్టల జనుల బ్రేమించుగోడా । వడ్డికాసులవాడ వరదా
సనీడ । యో ॥తి॥

భూమి శొల్లిపర రామకోటాహ్వాయ కామితవరద సుకారుణ్య
భావా। యో॥తి॥ శాళం జుల్వ.

అంబ బ్రోవవే భ్రమరాంబ గావవే హేరంబజనని దేవి చంద్ర
బింబశాంభవి ॥అంబ॥

కామరూపిణీ సత్కంజలోచనీ సౌదామినీ ప్రకాశగాత్రి సోమ
ధారిణీ ॥అంబ॥

భక్తపోషిణి పాపాబ్ధిశోషిణీ సత్సూక్తి శోభినీ భవాని శోక
నాశనీ ॥అంబ॥

భుజగభూషణి సంపూర్ణభాషిణీ గజసమాన గామినీ కాకాని
వాసినీ ॥అంబ॥

1 కీర్తన—ఆదితాళం.

నమశ్శివాయతే నమో। భవాయ ॥నమ॥

సుమనస వందితాయ భ్రమరేంద్ర గమనాయ ॥నమ॥

అంబర కేశాయ అంబిక నాథాయ ॥నమ॥

వృషభేంద్ర వాహనాయ విషధరభూషాయ ॥నమ॥

శాశ్వతకారాయ విశ్వేశ్వరాయ ॥నమ॥

కాలవినాశాయ ఫాలవిలోచనాయ ॥నమ॥

కాకాసి పురీశాయ శారివినుతాయ ॥నమ॥

2 కీర్తన—ఆదితాళం.

పూజసేతురార భుజగేంద్రహారా రాజితగుణాకర రజితాద్రి

విహార ॥పూ॥

తుమ్మిసుమంబుల జమ్మిదళంబుల నెమ్మది భక్తితో నిగమ
మంత్రంబుల ॥పూ॥

మారేడు పత్రితో మంచిగంధముతో నీరమ్యనామాళి కోరి
భజించుచు ॥పూ॥

రామకోటార్య సత్కామితవరద సోమశేఖరనా నోముఫలిం
చగ ॥పూ॥

3 నారాయణ నారాయణ-యను వర్ణమెట్టు,

గౌరీధవ గౌరీధవ జయ భీమేశహరా ॥గౌ॥

పారావారనిషంగా భాస్కరచంద్ర రథాంగా ॥గౌ॥

కాకోదరవరహారా భీకరపుర సంహారా ॥గా॥

కామసుందరరూపా హేమధరాధరచాపా ॥గా॥

రవిచంద్రానలనేత్ర దివిజాధిప సంస్తోత్ర ॥గా॥

సంయుక్త బుధజనపాలా సామజచర్మ సుచేలా ॥గా॥

రుద్రజంగమవేషా రుచిరవేదాంతభాష ॥గా॥

దానవవహ్ని కృపీటా తారకరాజ కిరీటా ॥గా॥

శత్రువిపినకీలా శర్వ దుర్జనకాలా ॥గా॥

భీమరాక్షసశోష రామకోటాఖ్యపోషా ॥గా॥

గ్రంధి వెంకట సుబ్బారాయనుత మాయబ్బా ॥గా॥

4 ఇటురార యిదిమేర - యను వర్ణమెట్టు.

ఇటురార నిటలాక్ష కుటిలాసుర తుదశిక్ష ॥ఇ॥
దక్షాధ్వర సంరక్షా యక్షేశ్వర హితపక్ష ॥ఇ॥
బుధజన సంయమిపాలా కుధర కన్యకలోలా ॥ఇ॥
కుండలి రాడ్భూషా పండితోత్తమపోష ॥ఇ॥
పెదకాకానిపురీ సదనాశ్రీ త్రిపురారి ॥ఇ॥

5 కరుణా ప్రసార - యను వర్ణమెట్టు.

పన్నగభూషా పరమసంతోషా సన్నుతభాషా జంగమవేష ॥ప॥
పార్వతిలోలా భవ్యసుశీలా గీర్వాణపాలా కీర్తివిశాలా ॥ప॥
పావకనేత్రా పాండురగాత్రా భావజజైత్రా భక్తాఘమిత్రా ॥ప॥

కరుణాంతరంగ గంగోత్తమాంగ సురవైరిభంగ శోభితలింగ॥ప॥

6 గోవింద యట్లోర్చియుందు-యను వర్ణమెట్టు

మల్లేశ కరుణించరావా। నా। యుల్లమునందున నమ్మితి దేవా॥మ॥
తల్లి తండ్రి నీవుగావా। నా। దండన జేయకు చేపితి శేవా॥మ॥
భ్రమరాంబ చిత్తాబ్జభృంగ। యో। భాస్కరచంద్ర రథాంగ। సమర సురారివిభంగ యో। సుమనసవంద్య దీపిత దివ్యలింగ॥మ॥
నిరుపమ గంగోత్తమాంగ। యో। నిగమసంచార కూపార నిషంగ। పరమలసద్దయాపాంగ। యో। పావకలోచన భవ్యశుభాంగ॥మ॥

వినుత మానసీశ సందోహా । శ్రీ। ఖితరజత శైల సద్గేహా । అను
పమవృషభేంద్ర వాహా । వి। ద్యాగమజాల సద్వ్యూహా॥మ॥

7 నిన్నెనమ్మినారా-యను వర్ణమెట్టు.

నిన్నెనమ్మినారా నీలకంఠ రార పన్నగేంద్రహార పాలనసీ
యర ॥ని॥
నామొరవినవేరా పామరజనదూరా కామితార్థమీరా కారు
ణ్యసాగర ॥ని॥
భద్రగుణదీపా భర్మశైలచాప ముద్ర సాధనరూప క్షుద్ర సం
సంతాపనే ॥ని॥
కాల్లిషర రామకోటార్య సత్కామ బల్లిదజనభీమ బాణావం

దితనామ ॥ని॥

8 నీరాజనాభుని నెరనమ్మినవారి-యను వర్ణ మెట్టు
పార్వతినాథుని బ్రస్తుతి జేయవే యుర్విని యోమనసా।
గీర్వాణపూజితు కీర్తనగావించ సర్వపాపములారునే । ఓ
మనసా ॥పా॥
ఆలుబిడ్డలనమ్మి గూలకవారాశి ఫాలాక్షు నుతియించవే । ఓ।
కాలుడు నిన్నుబ్రొంచ గాచుకయున్నాడు ప్రాలుమాలిన
కష్టమే ఓమనసా ॥పా॥
మిట్టిపడుచునీవు మిక్కుతవిధంబున నట్టిమాడకెమనసా।పుట్టువు
నెంచగ గిట్టుటకొరకే వట్టియాశలమానవే ఓమనసా॥పా॥

ముదముజెందుచును సంపదలునిత్యములని మదిలోననమ్మనేటి

కే। పెదకాకానిపుర సదనుమల్లేశుని వదలకభజియించవే ఓ

మనసా॥పా॥ 9 రామయిదేరా-యను వర్ణమెట్టు

పార్వతిలోలా పావనశీలా పర్వతఖేలా భస్మవిశాలా ॥పా॥

సర్వవిభూషా సంయమిపోషా దర్పకవేషా దానవశోషా ॥పా॥

రవిశశినేత్రా రమ్యచరిత్రా ప్రతిమలగాత్రా పరమపవిత్రా॥పా॥

రామకోటార్యా రతిఃణధుర్యా కామితౌదార్యా ఘనభుజ

శౌర్యా ॥పా॥

10 గామ నన్నుదయను యనుమెట్టు తాళం-రూపకం

ఈశనన్ను బ్రోనవేమిర । సర్వేశ॥

కాశీవిశ్వేశ యాకాశకేశ కలుషనాశ స ॥ర్వే॥
మేరుచాప కోపమేలర ॥మే॥
వారణచర్మాంబరభవ దూరశైలధీర శూర ॥యీ॥
మృత్యువైరి సర్వభూషణ॥మృ॥
కాత్యాయని ప్రాణేశ్వర నిత్యుడవనినమ్మితి మది॥యీ॥
రామకోటయార్య పోషణ॥రా॥
భీమాహవరిపుభీకర కామితఫల దాయక॥సర్వే॥

11 రామ దయజూడవేర-యను వర్ణమెట్టు

రాజరాజేశనగ రాజసుత ప్రాణేశ ॥రా॥

పూజగావింతుఫణి భూషమౌనీంద్రవేష॥రా॥
భృంగితురంగ భవభంగ గంగోత్తమాంగ
లింగజలధిని షంగ దయాంతరంగ ॥రా॥
మానినుతపాత్ర సుకుమార కుబేరమిత్ర ।
సూనశరమదజైత్రశోభిత ధవళగాత్ర ॥రా॥
భూతనాయకసుర పోషభక్త దాయకా
పాతకాకాని నికేతనుత గాయకశ్రీ ॥రా॥

12 కోమలాంగి తాళకున్నదిరా యను వర్ణమెట్టు

నీలకంఠ యిందురాగదరా । శూలధర మహేశ్వరా ॥నీల॥
బాలచంద్ర ధరభక్తపోష కరుణాలవాలనను గాంచి ప్రోచు

టకు ॥నీల॥

నందితురంగ యానందగుణాకర సందియమేలర సాధుజనావః
సుందరాంగ భూతనాధహార గోవింధ నందితముని బృంద
పరిపాలన ॥నీల॥

కష్టము బెట్టకగాచుచుశీఘ్రమభీష్టములిచ్చెదవనుచు వింటిర।కష్ట
బెట్టనేలననుయిటుధర। దుష్టవినాశత్రివిష్టపాలయనుత॥నీల।
భీకరదానవనీకమదాంతక లోకపాలన దర్వీకరసుభూష । పా
కవైరి పూజితపద పెద।కాకానిపురీశ గౌరీమనోహర॥నీల।

13 రామ దయానిధిరార యను వర్ణమెట్టు

శివాగిరీశ్వరరార । నీ సేవజేసెదనులేరా ।హరశివా॥

భవాబ్ధితరణా భావజహరణా ప్రవిమలసద్గుణజాలా హో । భ
క్త మునీశ్వరపాలా ॥హరశివా॥
కవిజనపోషా ఖండితదోషా రవిచంద్రానల నేత్రా హో । దివి
జేశ్వరనుతపాత్రా ॥హరశివా॥
కరిత్వక్చేలా గానవిలోలా స్ఫురితాటవివరకేలా హో । దుర్మ
దభేదనశీలా ॥ హరశివ ॥
సుందరవేషా సురుచిరభాషా బృందారకపుంగవా హో । మం
దిరనాథతురంగా ॥ హరశివ ॥
అంధకవైరిసురాధిపవినుతా గ్రంథముబ్బ రాయవరదా హో ।
కలుషమృణాళ ద్విరదా । హరశివా।

14 క్షేమమాయుమాపతి యను వర్ణనొట్టు

నేరమాదయాకరా ఫణిహారబ్రోవనూ ॥ యిది నేర ॥

మేరుచాపభాసితా । శూరారిపుదూరా గిరిధరా గుణపూ

రాయిది ॥ నేర ॥

అంగజారిభక్తపాలనా । గంగాధరభృంగీశ్వరలింగా భవభంగా

యిది ॥ నేర॥

శూలపాణిఫాలలోచన । శైలాత్మజలోలా సురపాలావరఖేలా

యిది ॥ నేర॥

కువలయారిమకుటదీపితా । భువియరదా కవివరదా భవహర

ణా వరకరుణా ॥ యిది ॥

15 రాజవదనప్రియే యను వర్ణమెట్టు.

రారగిరిజాప్రియా । ఘ.శి। రాజవిభూషణ రమ్యసుభాషణ॥ రార॥
భూరిదయాపాంగ భూమిశతాంగ-సు రారివిభంగకూ పారని
షంగయిటు ॥ రా ॥
ఖండితభవదోష కుండలివిభూష పండితసంతోష పరమార్థ
సంతోష ॥ రా ॥
లోకేశయీశ ప్రభాకరసంకాశ కాకానిపురీశ కందర్పవిలాస
॥ రార ॥

16 పాపహారణ యను వర్ణమెట్టు.

మోదమునలీవనా డో పాపమోచనా । నీ । పాలబడితి నన్ను

ప్రోవజాలమేలరా ॥ ఫా ॥
నందిగమన యనంగదమన । సం। క్రందవినుత యిందుమకుట
వందితామరా ॥ ఫా ॥
వ్యాళభూషణా దేవాళిపోషణా । కాలవైరికాలకంఠ మేలు
గూర్పరా ॥ ఫా ॥
స్వామిధీనిధీనిషంగ నీరధి । రామకోటయార్యవరద ప్రేమజూ
పరా ॥ ఫా ॥

17 కమలామనోహరా యను వర్ణమెట్టు.

గిరిజామనోహరా । కరిదైత్యనాశ కరుణజూడవేర ॥ గి ॥ నిర
తము నీమృదు చరణాబ్జంబుల స్మరియించితినో దేవా శ్రీ

కరుణాకర సద్భావా । పరమేశజూచి దరిని జేర్చవేర ॥గిరి॥
సూర్యధనుంజయ సోమనేత్రయౌదార్య ధనేశ్వరమిత్రా । ముని
నివర్యవినుత సత్పాత్రా । కార్యవిచక్షణశౌర్యధుర్యహర
॥ గిరి ॥

గంగాధరభవభంగ పురాంతక గానలోల సువిచారా యోఘన
దారుకసంచారా । అంగజారిభస్మాంగ విరాజిత ॥ గిరి ॥
పెదకాకానిపురీవరసదనా సదమలసుందరవదనా యో। మద
విద్విషజయకదనా।ముదమున్ డసంపదలనొసంగర ॥గిరి॥

18 మాటికినిబలుమాటలేటికిరా యను మెట్టు.

మోదమునదయబూనిరాగదరా । వేదాశ్వభాసిత ॥ మో ॥

(ద్రోవజాలమేలరా ॥ ఫా ॥

సందిగమన యనంగదమన । సం । (క్రందవినుత యిందుమకుట
వందితామరా ॥ ఫా ॥

వ్యాళభూషణా దే వాళిపోషణా । కాలవైరికాలకంఠ మేలు
గూర్పరా ॥ ఫా ॥

స్వామిధీనిధీనిషంగ నీరధి । రామకోటయార్యవరద (ప్రేమజూ
పరా ॥ ఫా ॥

17 కమలామనోహరా యను వర్ణమెట్టు.

గిరిజామనోహరా । కరిదైత్యనాశ కరుణజూడవేర ॥ గి ॥ నిర
తము నీమృదు చరణాబ్జంబుల స్మరియించితినోదేవా (శ్రీ

కరుణాకర సద్భావా । పరమేశజూచి దరిని జేర్చవేర ॥గిరి॥

సూర్యధనుంజయ సోమనేత్రయాదార్య ధనేశ్వరమిత్రా । ము
నివర్యవినుత సత్పాత్రా । కార్యవిచక్షణశౌర్యధుర్యహర
। గిరి ॥

గంగాధర భవభంగ పురాంతక గానలోల సువిచారా యోఘన
దారుకసంచారా । అంగజారిభస్మాంగ విరాజిత ॥ గిరి ॥

పెదకాకానిపురీవరసదనా సనమలసుందరవదనా యో। మద
విద్విషజయకదనా।ముదమొందసంపదలనొసంగర ॥గిరి॥

18 మాటికినిబలుమాటలేటికిరా యను మెట్టు.

మోదమునదయబూనిరాగదరా । వేదాశ్రభాసిత ॥ మో ॥

భేదరహితభవాదిదేవ ఖేదదూరవివాదమేల ॥ మో ॥

నీలకంఠవాగ్వీశాల బాలచంద్రమౌళిశైల ఖేలవిబుధజాలపాల
కాలవైరియా । జాలమేలఫాలనేత్ర శూలపాణికారుణ్యాల
వాలవైరివిపినకీల జాలిజూడవేలనేల ॥ మో ॥

కిన్నరేంద్రమిత్రనిన్నె సన్నుతించితిని సుప్రసన్న నన్నుగావ
రాపన్నరక్షక । పన్నగేంద్రహార తప్పులెన్నక మ
న్నించ నీ కన్నవేరె వేల్పులెవ్వరున్నారన్న భక్తులెన్న
॥ మో ॥

భీకరదానవనాశ లోకాతీతసంయమీంద్ర లోకనుతపాదపద్మ
లోకనాయకా । పాకవైరిపూజిత, నిరాకారసాకారధీర కా

కానిపురధామ సుజనానికపాద శోకనాశ ॥ మో ॥

19 అటతాళం.

ఫాలాక్షునను బ్రోవరా । పార్వతీశ । జాలమేలనురార । బాలి
కచేతను పాలుదెప్పించుక గ్రోలి కైలాసముమేలుగ నివ్వ
వే । బాలుమార్కండేయునిబట్టి బాధించంగ । కాలున
ప్పుడు మదముబో నెట్టి । మునిపుత్రున । కోలిప్రాణముల
చేపట్టి । యొసగవె చిరకాల జీవితుగనాపట్టి మొరవెట్టి
పాలుమాలక రెంమిగడియలు భక్తితో నీప్రార్థనంబను।
కూలముగ నొనరించువారిని మేలుబొందగ జేతు వెయ్యోడ
॥ ఫాలా ॥

చెంగట శేర్చ వేరా । పరమేశనీ । శేవ జేతు లేరా । సంగరసిం
తిన్గ సదయజూడకున్న దొంగవని లోకమునంగ తుసా
టెద భృంగివాహన చంద్రశేఖరా । సర్వజ్ఞసర్వమంగ
ళాధిప వైరిభీకరా । యభవామిత్రిగొంగ సురనుతజనవశీక
రా । శంభోధవ । ళాంగ తేజసమప్రభాకరా । యేమంను
రా లింగభాస్కర తుహినకరయరదాంగ గంగాధరగిరీశ
సంగరారివినాశయబ్ధినిమంగ మన్మధభంగధీరా ॥ ఫా ॥

దాసపాలనసూచనా । పెదకాకాని । వాసపాపవిమోచన ।
వాసవార్చితపాద వనజలోకేశ్వరనీసమాను లెవ్వరోసురలం
దున । మోసపుచ్చకునన్ను పురహారణా । నేని దాసదా

సుడనుభుజగేంద్రాభరణా । నందనమో వికాసరుచిరము
సీంద్రనుతచరణా । ముక్తీశ్వర భాసమానసుశారి సంహా
రణా । వరసుగుణా జేసితినిగ శుభక్తిసేపద సేవహృత్కమ
లంబునందున కాసుజేయ నటుంచుజూడకు గ్రంథి సుబ్బా
రాయవరద ॥ ఫాలా ॥

20 రంగా రాజయుందురారా-యను వర్ణమెట్టు.

గౌరీనాథయుందురారా వరద ॥ గౌరీ ॥
ధీరా మానినందారా భక్తమందారా గిరీశ్వరరారా । వరద
॥ గౌరీ ॥
శూలపాణికరుణాలవాల సురపాలకాల కంఠరారా।వరద॥గౌ॥

లింగానందితురంగా జలధినిషంగా మిత్రిగొంగరారా । వరద

॥ గౌరీ ॥

దీనపోషకా కాకానిపురాధిప సూనశరాంతకరారా ॥వరద॥
భీమవందితగుణస్తోమా కామితఫల రామకోటార్య నుతరారా
॥వరద॥

21 సదానంద నీపదాంబుజంబులు-మోట్టు-ఏకతాళము.

హారా చంద్రశేఖరా వైరిభీకరా సురారినిరాకరా । నగేశవం
దిత గిరీశబ్రోవర పురారి తేజవిభాకరా ॥హా॥
భవా పార్వతీధవా కమలసంభవా వినుతసురనాయకా । శివా
భూతపతికపిల సేవితయాచార్య గుణసంధాయక ॥హా॥

అమాయకుడ భారమా (బ్రోవ నేర మేమి జేసితి నీయుతా ॥ స
మానమెవ్వరు కుమారజనకా విమానచర సంశేవితా ॥హ॥
వియత్కేశ సద్దయాకరా రణ జయాద్రిచాపవిభీషణ॥ సుయో
గసాధన నయారామకోట యాఖ్యాభక్తసుపోషణ॥హ॥

21 గోపీనందన-యను వర్ణమెట్టు.

గిరిజారమణా యురగాభరణా పరమేశ్వర ఋటుగా వోయి ।
సురమునిపాలా సుగుణవిశాల దురితములణచను రావో
యి॥౧॥

వేదతురంగా విమలశుభాంగా వాదమేల ఋటురావోయి । భేద
రహిత నిర్వాదపరాత్పర ఖేదము బాపను రావోయి ॥౨॥

సూరిజనావన మేరుశరాసన భూరిగుణాకర రావోయి
దారుకవన విహారపురారీ నేరములెంచక రావోయి ॥ ౩॥
సదమలరూపా సద్గుణదీపా ముదమున నెంచితి రావోయి
పెదకాకానీ సదనజలంధర మదహరణా యిటురావోయి ॥౪॥

## 23 రామానన్ను బ్రోవరా - ఆదితాళం.

ఈశనన్నుబ్రోవవేరా । పరమేశా । యీశా *కిల్బిషవినాశా
నాదితనిర్జరేశా పురనాశా వరజగదీశ ॥ యీ ॥
పాత్రా రవిశశివహ్ని నేత్రా మునిజనవనచైత్రా రిపుజైత్రా
కుబేరమిత్ర ॥ యీ ॥
లింగా వృషభేంద్రతురంగా వారధిసమంగా ధృతగంగయో

మిత్రిగొంగ ॥ యా ॥
పూర్యా సత్కీర్తిసుబ్బరాయార్యా రక్షించుమహాదార్య గుణ
ధుర్య వినుతశౌర్య ॥ పర ॥

24 పరాకు శేయుట పాటిగాదురా యదు మెట్టు.

పురారినమ్మితి బ్రోవవేమిరా సురమునీంద్రవినుతా పరమో
దార కపాలధారినీపదముల వదలనురా । వరద ॥పురా॥
గజదానవహార గానలోలనీ భజన జేసినారా । భుజగవిభూషణ
కుజనవిదూర రజితశైలవాసా వరద ॥ పురా ॥
దక్షునియాగము ధ్వంసము జేసిన దక్షుడవంటినిరా । రక్షితభు
వనా యక్షేశ్వరసఖ కక్షుబూనకయ్యా వరదా ॥పురా॥

పెదకాకాని సదనవిరాజిత కదనవైరినాశా । సదమలరూపా
సాధుజనావన మదనమథనదేవా । వరదా ॥ పురా ॥

25 విడెముసేయవే యను వర్ణమెట్టు.

కరుణజూడరా, నన్ను కమలాదివా ॥క॥
గిరిజాతనయా నాథానీదు చరణములను దలతుమదినీ ॥కరు॥
ఫాలలోచన దేవనుత పన్నగాభూషణ భవ నీలకంఠ వేద
వేద్య శూలపాణి యాగభంగ ॥కరు॥
రామకోటయార్యాపోష కామవైరిసర్వభూమ ॥కరు॥

26 సురేశ దేవతానుతా యను వర్ణమెట్టు.

భవాని ప్రాణనాయకా నమోనమోనమో। దివాకరాబ్జ

వహ్నిలోచనా । దేవా దేవా కపీశవందితా ॥భవా॥
బాలచంద్రశేఖరా హరా। శూలపాణి వ్యాళభూషణా॥భవా॥
భర్మశైలచాప భూరథా-కర్మదూర ధర్మదీపితా ॥భవా॥
రామకోటయ్యాఖ్య వందితా-రమ్యభావ సామసన్నుతా॥భ॥

27 ఉండేదే రాముడొకడు-యను వర్ణమెట్టు.

బ్రోచేదే సాంబశివుడు పూర్ణకరుణచేత మనసా ॥బ్రో॥
చూచినంతనె పాపమోచనమును గావించి ॥బ్రో॥
సామసన్నుతుడు సురగణ సంపోషిత మానసుడరి భీముడసు
రనాశకుండు కామహరుడు కరుణమీరి ॥బ్రో॥
కాకాని పురధాముడు శ్రీకంఠుడు లోకహితుడు ॥బ్రో॥

28 గతమోహాద్భుతశీలా-యను మాదిరి- —రూపకం.

పరమేశా పురనాశా దురితార్ణవతరణా । కరుణాకర పరభీకర

సుర విద్వేషహరణా ॥ప॥

హతదోషా ద్భుతరోషా యతివందితచరణా । చతురానన

నుతపావన ధృతభుజగాభరణా ॥ప॥

ధవళాంగా భవభంగా ప్రవిమల గుణభరితా । సనకాదిన

భుపిపాలన దివిజేశ్వర వినుతా ॥ప॥

వరశూలా ధరశీలా గిరిశిఖర సుఖేలా గురు రామ కోటీశ

సద్వరదా ఘనలీలా ॥ప॥

29 రానుపోరా రాజాగోపాల-యను వర్ణమెట్టు.

శూలపాణి సురుచిరవాణి। ఫాలలోచనమానిపాల రావేల॥శూ॥
చాలనమ్మితి రావేల దయాళూ పాలుమాలిన నన్నేలువా
రెవరు ॥శూ॥

సర్వభూష జంగమవేష। కర్పూరసమగాత్రా కలుషవిదూర
యర్పణజేతు నాయాత్మసుపూజ ॥శూ॥
నందివాహా। సుందరదేహా। కందర్పవైరి యేమంచు నేరము
లేను వందనమొనరింతు మందవికాసా ॥శూ॥
మాంగిపాల। గానవిలోలా। దీనాజనావన దిక్కునీవే కాకాని
పురీశ్వర సూనశరారి ॥శూల॥

30 దేవాదిదేవా నీసేవకుడను వర్ణము.

మల్లేశదేవా నావల్ల నేరములేదు యుల్లమలర బ్రోవరా॥మ॥
ముల్లోకనాథ సదుల్లాస మానస చల్లనికృపజూడరా ॥మ॥
పాపవారాశిలో, బడిపొర్లుచుంటినా యాపదబాపవేమి ॥మ॥
స్వామినీనామము వేమారుదలచక పామరుడనైతిని ॥మ॥
కొల్లిపర రామకోటార్య పూజిత కల్లలనణగించరా ॥మ॥

31 తెల్పెద దెలియుము యతువర్యా-యను మెట్టు.

శంకరా। శాశ్వతరూపరార। పంకజాసన వినుతనీదు కింక
రునిగాజూడరా ॥శం॥
శైలజా। స్వాంత నివాసయీశా। చొలుబుట్టగ చిత్తమం

దున చదివెదను నీచరితలు ॥శం॥

భారమూ । పాలనసేయబూన । భూరిదోష వినాశ కుండలి

హారధీర గుణాకరా ॥శం॥

దానవా । దండన కార్యశూర । సూనశర మదజైత్ర పెదకా

కానిధామ విరాజిత ॥శం॥

## 32 కీర్తన—ఆదితాళం

భావయామి గౌరీనాథం వారితఖేదం ॥భా॥

సేవిత సురబృందమోదం పావకాక్ష నిర్వివాదం ॥భా॥

పూజిత భక్తాంతరంగం పూరిత కరుణాపాంగం ॥భా॥

ఖలజన దుర్మదదమనం గంధేభ రాతిసమధనం ॥భా॥

రాజిత పాండురగాత్రం రావణ పూజితపాత్రం ॥భా॥
కాకాని సత్పురవాసం ఘనతర వరమందహాసం ॥భా॥

33 కీర్తన—ఆదితాళం

శివ పంచాక్షరిమంత్రం యిది భవనాశనకారణ తంత్రం ॥శి॥
మునిజనమానస వనచైత్రం । యిది । అనిమిషాళి ప్రమద
చైత్రం । దీక్ష భక్తజననుతపాత్రం । యిది । మోక్షపద
వి సాధనసూత్రం ॥శివ॥
దీనపాల ముల్లోక పవిత్రం । యిది । మానిత కలుషలతాలవి
త్రం । జ్ఞాన మార్గశోభన క్షేత్రం । యిది । న్యూనజనా
ఘనివారణ వేత్రం ॥శివ॥

34 ప్రాణనాయకా దీనజనశుభదాయకా-యను మెట్టు.

సర్వభూషణా సాధుజన పరిపోషణా ॥స॥

దర్పకాంతక నీదుపదముల దలచి మానసపూజలను సేసర్పణా

ము గావింతుదయతో నభవగావర సమ్మతీ ॥సర్వ॥

ఫాలలోచనా పాపసంచయమోచనా ॥ఫా॥

జాలుకోపము భూతపతి ప్రతిమాలితిని దయతోడగావర

పాలుమాలిన నిన్ను దిక్కైద కాలమదహర ధూర్జటి ॥ఫా॥

గౌరినాయకా కలుషభంగ విధాయక ॥గౌ॥

మేరుచాప కుమారజనక దూరదోష భవాబ్జశేఖర వేడుసీ

యుకు నీదుభక్తుని కోరికలు నెరవేర్చరా ॥గౌ॥

మల్లికార్జున మహితశాస్త్ర ధనార్జన ॥మ॥
కొల్లిపర సద్వంశ రామ కోటయాహ్వయవరద నావల్ల నేరము
లేమిలేవు చల్లని దయగావరా ॥మ॥

35 బాలకృష్ణ జాలిలేదా-యను వర్ణమెట్టు.

బాలచంద్రమౌళి గానలోల నన్ను బ్రోవరా ॥బా॥
నీలకంఠ నిగమవినుత యేలర నీనమ్మితి । ఫాలనేత్ర ధవళ
గాత్ర పార్వతీశ నమ్మితి ॥బాల॥
కాంచనాద్రిచాప కలుష సంచయముల నణచరా । పంచబా
ణమదవిభంగా గాంచర దయ పురహారా ॥బాల॥
దండధారి వైరి నీను యండ జేర్చవేమిర । కుండలీంద్ర భూష

యఖండ తేజస్స్వామిరా ॥ బాల
అంధకాసురహరణ పరిపంథిలోక భీకరా । గ్రంధి సు గ్బ
రాయవరద బంధురగుణ శ్రీకరా ॥ బాల॥

36 సోమా ఝంతా పామరమా-యను మెట్టు.

దేవనన్ను బ్రోవరసి సేవజేసితినిరా । భావజ సంహారనాపై
పంతమేలమానరా ॥ దే॥
దక్షయాగ భంగ నాపక్షమూనవేలరా యక్షరాజమిత్ర నా
• పై కక్షుయుంకజాలురా ॥ దే॥
ఫాలనేత్ర భక్తజన పాలదం జూడరా । శాలినిమీగగ న శ్రీ
దెవములవేడరా ॥ దే॥

కాకొని పురధామ దర్వీకర రాడ్భూషణా । లోకాతీతా గి
కుమారి లోలవైరిభీషణా ॥దే॥

37 ఏమందునో సుందరీ యందము-యను మెట్టు.

శ్రీగౌరి చిత్తేశ సేవింతురా । మది । భోగీంద్రభూషణ పోషిం
చరా ॥శ్రీ॥

పారదనిభగాత్ర పాలించరా । హర । మారారి నామొర
నాలించరా ॥శ్రీ॥

నాగచర్మాంబర నగమందిర । హర । యోగీంద్ర సంరక్షవో
సుందరా ॥శ్రీ॥

గాన సుఖానంద కాలాంతక । హర । దీనజనావన త్రిపురాం

46 కమలాక్షా కరుణించరాదా యను మెట్టు

పరమేశాననుబ్రోవరాదా । హర । పుర । హరణ ॥ ప ॥
అరిభీకరశంకర మహాదేవ । మొరవినరా । ననుగనరా శరణు
శరణు ॥ పర ॥

భరమానాదగు భవములణంచను । వరశీలా । సురపాలా ।గి
రిజారమణ ॥ పర ॥

సురవందిత సుందరభూతేశా కరుణించు । గతినొంచు యుర
గా భరణ ॥ పర ॥

కనికరించుకాకాని పురీశ్వర దినరాజ । సమతేజ । వనధిని
షంగ ॥ పర ॥

47 యేతీరుననను దయచూచెదవో యను మాదిరి
వరీతినినను కరుణించెదవో యీశ్వరనీమది దేవా । భారమా
ననాథవములణాచను భక్తసుపోషణ దేవా ॥ ప ॥
నిర్మల తేజమునీవవిశాల ధర్మవిరాజిత దేవా । మర్మదభేదనధూ
ర్జటి గనవీ కర్మమేమి దేవా ॥ ప ॥
ముదముతోడ నీపూజలొనర్చక మదమునదేలితి దేవా । కాద
వలేదు నీకవివిశ్వేశా బెదరుదీర్చుమో దేవా ॥ ప ॥
మల్లేశ్వరనీ మహిమలనెంచను యుల్లమదేమో దేవా । కల్లలు
బల్కగాంచును నాలుక ప్రల్లదమానది దేవా ॥ ప ॥
వదలనిభక్తితో పదములగొల్చెద పదవినొసగుమో దేవ । పెద

కాకాని పురీశ్వర పాపము వదలించుము మహాదేవ ॥ ప ॥

48 మునినాథానామీద యను వర్ణమెట్టు

సగధీరా ఫణిహారా । నను బ్రోవవేర దుర్వారశూర ॥ స ॥

గగన కేశ నే మారుభజించితి కరుణించుము కృపతో ॥ గ

సరైరిమునులునీజాడ నీవాడ । దురితంబుపీడ॥ స ॥

కను వేడుకతో పాలు నొసంగిన కడుపునిండ గనుగ్రోలి । యా

గాడగూచి సుధిశాలి । సతిజాలి । బ్రోవవేయాలి॥ సగ ॥

చిరింకొండని మందిరముకు జేరి శిరియాళుని శాకమును । నిచి

త్తమలరగోరగను । మొసగగను।కరుణించలేదెమును॥సగ॥

కాలుడు మార్కండేయుని జంపగ కాలపాశమునుబట్టి । బ్రో

ణాబులు దీయగనట్టి చేపట్టి బ్రతికించినట్టి ॥ నగ ॥
భాసుర పెదకాకానిపురీశ్వర భక్తపోషభూతేశ । యోవాస
వనుతమల్లేశ । పరమేశ । దైతేయనాశ ॥ నగ ॥

## 49 సురటరాగం - ఆదితాళం

గిరీశ శ్రీపుమికా । సత్వర ॥ గిరి ॥
పురారికుండలి భూషవిరాజిత ॥ గిరి ॥
సురేశవందిత నరేశపూజిత పురాణపురుషనిరాదరించక ॥ గి ॥
దినేశతేజ సుధీరదయాకర మునీంద్రమానస. వాసా మనో
జవైరి విమానచరనుత ॥ గి ॥
పెదకాకాని సదననిలయ దుర్మదభేదన పామరుడనిజూడక ॥గి॥

50 మాటలాడగితినా యను-పర్ణము

నమ్మితిరా దేవ నాగవిభూషణ నెమ్మనమందు నను ॥ రమ్మ
కరుణాతోడ సమ్మతిమీరగ యిమ్మ నీదుభక్తి యీశపరాత్పర ॥ నమ్మి ॥

భక్షాటకునివేషి బెట్టుమాసియాచింప పృథివితప్పునాదె । య
క్షేశమిత్ర నిటలాక్ష జగద్రక్ష పక్షపాతివివు ప్రార్థించద
గదుర ॥ నమ్మి ॥

శిలల రుప్ప్వారి చేపట్టిబ్రోతువు బలిమికారణమనఘు । పలు
మారువేడిన భక్తజాలంబుకు బలుకవైకొన్నను భయము
లేకనె గద ॥ నమ్మి ॥

గ్రంథి సుబ్బారాయ కవిపూజిత పద గంధేభ చర్మాంబర ।అం
ధకసురవైరి బంధుర శైలజభవ బంధములను ద్రోచు బాలేం
దు శేఖర ॥ నమ్మి ॥

51 శ్రీరామచంద్రునకు -యనుమెట్టు ఆదితాళం

భ్రమరాంబనాథునకు భర్మాద్రిచాపునకు సుమనసవందితున
కు జయ జయ జయ. రాం రాం రాం ॥భ్ర॥
మల్లేశ్వరునకు మానధనాఢ్యునకు చల్లాని మానసునకు జయ
జయ జయ. రాం రాం రాం ॥భ్ర॥
సంగీత లోలునకు భృంగీశ వాహనునకు గంగాధరునకు జయ
జయ జయ. రాం రాం రాం ॥భ్ర॥

కాకాని మందిరునకు కర్మ విదూరునకు లోకాధినాధునకు
జయ్ జయ్ జయ్. రాం రాం రాం ॥భ్ర॥

52 మంగళహారతి-ఏకతాళం-కరిరాజవదనునకు యను వర్ణము

మల్లేశ లింగమునకు మహితమంగళం చల్లని దేవునకు సర్వ
మంగళం ॥మ॥
నిగమాంత వేద్యునకు నిత్యమంగళం జగదేకవీరునకు జగతిమం
గళం ॥మం॥
విమలస్వరూపునకు విజయమంగళం భ్రమరాంబ నాధునకు
భద్రమంగళం ॥మ॥
కాకానివాసునకు కాంతిమంగళం పాకారివంద్యునకు భవ్య

మంగళం ॥మ॥

53 మంగళహారతి. పవమాన సుతుడుబట్టు-యను వర్ణమెట్టు.

భ్రమరాంబ నాధునకు భవదోష దూరునకు భ్రమరేశ వాహనునకు భవ్యమంగళం ॥భ్ర॥

భుజగేంద్ర హారునకు గజచర్మధారునకు రజతాద్రివాసునకు రమ్యమంగళం ॥భ్ర॥

ధర్మాద్రి చాపునకు భక్తసంరక్షుణునకు నిర్మల తేజునకు నిత్యమంగళం॥భ్ర॥

లోకాధి నాధునకు సాకారదేవునకు కాకాని వాసునకు కాంతిమంగళం ॥భ్ర॥

తక ॥శ్రీ॥

మేరు శరాసన మేలెంచర । హర । సారెకు కోపము చాలిం
చరా ॥శ్రీ॥

భక్తసంరక్షణ ఫాలేక్షణ।హర।భుక్తి ప్రసాదిత భూరక్షణ॥శ్రీ॥

కాకాసి మందిర కామేశ్వర । హర । రాకాబ్జ మకుట రాజే
శ్వరా ॥శ్రీ॥

ధీమతి దాసుల దీవించరా । హర । రామకోటాహ్వాయు ప్రే
మించరా ॥శ్రీ॥

31 కీర్తన—జుల్వతాళం.

అసమనేత్ర యమరస్తోత్ర యసురజైత్ర గావరా । భసితగాత్ర

భక్తమిత్ర వ్యక్తసూత్ర బ్రోవర ॥అ॥

దీనపాల, దివ్యశూల నీవిశాల సమ్మతి । గానలోల గ్రావశీల

కరకపాల సమ్మతి ॥అ॥

వైరిశోష వ్యాళభూష నరసుభాష సురవర । దూరదోష నీర

నేమ భూరిగోష పురహార ॥అ॥

ఈశ పార్వతీశ గగనకేశ దేవవందితా । పాశనాశ భవవినాశ

భస్మకాశ నందితా ॥అ॥

**39** కోదండరామ కోదండరామ-యను మెట్టు.

పాహిపురారి పాహిపురారి పాహిపురారి పాపవిదారి । దేహి

ధవళాంగదివిజారిభంగ వనధినిషంగ ॥పా॥

వేదతురంగ విమలాంతరంగ వాదధరగంగ వద్దునిస్సంగ ॥పా॥
సర్వవిభావ సజ్జనపోష దర్పకవేష దానవశోష ॥పా॥
అభవ త్రినేత్ర యక్షేశమిత్ర శుభకరపుత్ర శోభితగాత్ర॥పా॥
బిడ్డడగాదా బెట్టకుబాధ చెడ్డపనిగాదా శివగావరాద ॥పా॥
గుష్టుడనంటి దారప్రనీవంటి కష్టముల్ గొంటి కరుణించమంటి॥పా
ధర గ్రంధి సుబ్బదాసునుయుబ్బ వరమీవరబ్బ వరశిమ
లబ్బ ॥పా॥

40 తల్లి నిన్ను నెరనమ్మినానువినవె యను మెట్టు.

దేవ నన్నుదయబ్రోవరార వేగ ॥ దే ॥
భావజారిహార సేవనొసర్చెద ॥ దే ॥

శూలపాణికరుణాల వాల బుధపాల శైలసుతలోల ధీనిధి ॥దే॥
సుందరాంగ మునిబృందసేవిత నందివాహ పురందరనుత ॥దే॥
మందరధీరామహితవిచార। యిందిరేశహితవందితామర॥దే॥
భూతనాయకవి ధాతసుపూజిత పూతమానసవిఖ్యాతచరిత్రా।
పాతకదూరా । పన్నగహారా । భీతరహిత సంగీతవినోద
॥ దే ॥
వ్యోమకేశగిరిధామ కొల్లిపర రామకోటయార్యాసు పోషణ
॥ దే ॥

41 కీర్తన - ఆదితాళం

నెరనమ్మియుంటినిరా । రార రార రారత్వర ॥ నె ॥

పురవైరిపన్నగ భూషవిరజిత కరిచర్మచేలాభవా । భవా
భవా మది ॥ నెర ॥
గంగాజటాజూట సంగీతవిలోల భృంగీశవాహాశివా । శివా
శివా మది ॥ నె ॥
దుర్గామనోహర స్వర్గాధిపా నుత భర్గ మునివర్గ ప్రభో। ప్రభో
ప్రభో మది ॥ నె ॥
ఆకాశ కేశ పెదకాకానిమందిర భీకరరిపుసంహారా హారా హారా
మది ॥ నెర ॥

42 వినుధరఁ నాయకా యను వర్ణమెట్టు

పురహారణా బ్రోవరా । సురగణనుతసుందర పరమేశా ॥పు॥

దురితనాశ దుర్భరరిపుజితవర కరిచర్మాంబర కరుణించియు
పుర ॥ హ ॥

అనిమిషనందిత పనివశీవేడితి మునిజనసేవిత దండనసేయకు
పుర ॥ హ ॥

పెదకాకాని సదనగిరీశ్వరకదనధీర శంకర భవహర పుర ॥హ॥

43 మొరవినిబ్రోవరా శరణాధిప యను మెట్టు

కరుణతోబ్రోవర గిరిజేశధీనిధీ నెరనమ్మియుంటిరా శరణాధిప
పోషణ ॥ క ॥

సరసగుణార్ణవ సమయమిదేర దరిజేర్చరను దైవలలామ॥క॥
యురగవిభూషణ దురితనివారణ పరమేశదివ్యసుందర గాన

గోల కరుః ॥

శరధిసమంగ కరిదైత్యభంగ ధరశైలాకాస మందిర మల్లికా

ర్జున ॥ క ॥

## 44 బ్యాంపు - ఆదితాళం

శివునిసుపూజలు సేయుదమా భవహారుశూలిని వేడుదమా

భవబంధంబుల ద్రెంచునట భక్తుల ప్రేమనగాచునట ॥ శి॥

మునుమార్కండుని బ్రోచెనట మునివరులనుదయ జూచెనట

ఘనపాపంబుల బాపునట పనిపడికోర్కులదీర్చునట ॥ శి ॥

శిరియాళునిదయనిచ్చెనట చిరతొండాఖ్యునిగాచెనట

శరణాగతులరక్షించునట గురుతరతప్పుల నెన్నడట శి

పెదకాకానిమందిరుని సదమలతేజుని సద్గురుని
హృదయవిశాలదయాపరుని ముదమునగాంచుచు పురహరుని
   ॥ శివ ॥

**45 ఎపుడుకృపగల్గునో యను మెట్టు**

కరుణగనవేలరా. పురహరమదినిన్ ॥ కరు ॥
పరమేశముక్కంటి పాలితమానిసుర నరదనమ్మియుంటి । వా
   దుసేయక దేవ ॥కరు ॥
గజదానవాంతక గానవిలోలహార భుజగవిభూషణ భూమిశే
   తాంగనన్ ॥ క ॥
యతినుతరామకోట యాఖ్యసుపూజిత ॥ కరు ॥

శ్రీకరలోకేశ యాకాశకేశ కాకాని పురివాస కాత్యాయ
నిశ ॥లాలి॥

స్వస్తి.

స్వస్తిప్రజాభ్యాం పరిపాలయంతాం। న్యాయేనమా
ర్గేణ మహీం మహీశా। గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం।
గజాస్సమస్తా స్సుఖినోభవంతు

తెలుగాగిగంగ మల్లేశా। శివగౌరీశ్వరమల్లేశా। హార
యతినుతరామకో గాకర రనుతపద శుభకరసర్వజ్ఞా॥హార॥

మల్లేశ్వరార్పణమస్తు.

ఇయ్యాది వైశ్యకుల క్షీరపారావార [illegible]కాసుధాకర

[illegible]తృవర్గ భీకర కౌండిన్య సగోత్ర పవిత్ర బసవయ

సుబ్బమాంబా ప్రియపుత్ర కవిజనాప్త వేంకట

సుబ్బరాయగుప్త ప్రణీత మల్లేశ్వర కీర్తనలు.

శ్రీ శ్రీ శ్రీ.

